# విషయసూచిక



# INTRODUCTION

I may introduce myself as a student of ancient Indian History and as one who had occasion to study a number of outstanding works on our ancient civilization, written by reputed historians and scholars, like K. P. Jayaswal, Narendranath Law, Kalidas Nag, Rameshchandradutt, Radhakumud Mukherjee, Harvilas Sarada, Radha Krishnan, among Indians and Maxmuller, Macdonald, Col Tod, Heeren, Sir Monior Williams, Wilson, Colebroke and others among Europeans who have made a deep and critical study of our ancient literature and made valuable contributions to our ancient glory. I have acquainted myself with some of the Telugu, English and Hindi translations from our sacred texts and collected ample and useful information on the growth and development of political and educational institutions, cultural and spiritual greatness, expansion of trade, and other aspects of our ancient civilization. Most of us who are fed on the glory of the west, are under the false impression that we are a brutish breed and being civilized by the western nations. This impression will vanish if we have a mind to know our past and if we make a sincere and honest attempt to do so. Every student of Indian historical research will come to the enevitable conclusion that ours is a glorious race, that the achievements of our ancients in all fields of life are a wonder and admiration, that the breadth of their view, the loftiness of their intellect and the other admirable talents they were gifted with, are a revelation to us and that we, the so called modern and civilised, are no comparison to them at all in any field of activity. Recollection and veneration of the past is also a piece of patriotism

and he who so does, can be said to be a patriot in his limited sphere. Now that the foreign rule has gone and that the Indian Republic has come into existence, I hope that every reader will earnestly try to know his country's past and rightly appreciate it.

The first edition of about 150 pages was published some years ago and all the copies have been exhausted by free distribution. I have been able to collect more material and I wish to revise and improve the first edition so that it may come to about 250 pages in all. This booklet contains the first pages of the revised edition and will enable the reader to know the trend and the nature of the information gathered.

— K. B. Subbarayudu.

---

# భారతదేశము-ప్రాచీనౌన్నత్యము

## (India and its Glory)

## మొదటి భాగము

ప్రాచీన భారత దేశచరిత్రను గూర్చి వ్రాయుట సంతోషజనకమైనను బహు కష్టసాధ్యము. దానికి పలువురు పలువిధముల జెప్పుట, ప్రజలలో వ్యాపించిన మూఢత్వము, విద్యావిహీనత, విదేశీయులు కొందరు ద్వేషపూరితులై, యసూయాపరులై మన మతాచారములను, రాజకీయాభిప్రాయములను, సాంఘికాది జీవితములను విపరీతముగా గ్రహించి సత్యమును తలక్రిందు జేసి గ్రంథములు వ్రాసి ప్రచారము జేయుట కారణములని చెప్పవలసియున్నది. ఆ గ్రంథముల నాధారముగా గైకొని పెక్కుమంది మన భారతీయులు, మన పూర్వులు చాల యనాగరికు లనియు, పశుప్రాయు లనియు, విద్యావిహీను లనియు, నిత్యము మతవిచారణయందే మునిగి తేలుచుండెడి వారనియు, రాజ్యపరిపాలనా విధానము లేవియు దెలియనివారనియు తలపోయుట మనము ప్రతిదినము పలుచోట్ల చూచుచున్నాము. అంతియేగాక వారు మన భరతఖండ మేబది, యరువది వత్సరముల నుండి మాత్రమే ధనధాన్యసంపదలతో నిండి యున్నదనియు, నంతకు బూర్వము ప్రజలందరు సభ్యత, నాగరికత యననేమో యెరుంగక దరిద్రులై సృష్ట్యారంభము నుండియు నావిధముగనే కాలము గడిపి యుండిరనియు యభిప్రాయపడుట కూడ మన మెరుంగుదుము. ప్రాచీన సంస్కృత, ప్రాకృత గ్రంథముల పరిశోధించి విమర్శించినను పలుతావులందు దొరకు శిల, తామ్రశాసనములను, నాణెములను చదివి చూచినను శిథిలములైన ప్రాచీనకోటలు, సౌధములు, ప్రాకారములు, స్థూపములు, తక్షశిల, నలంద, హంపి పాటలీపుత్ర, మహెం

జదార, హారప్ప మున్నగు పట్టణ రాజముల దర్శించినను, నరేంద్ర నాథ్‌లా, జయస్వాల్, రాధాకుముద్ ముఖర్జీ, రమేశచంద్రదత్తు, కాళిదాస్‌నాగ్, హరవిలాస్ శారదా మున్నగు సుప్రసిద్ధ భారతీయ చరిత్రకారుల యమూల్య గ్రంథములు చదివి చూచినను, మాక్సు ముల్లరు, మాక్సు డంకరు, మాక్డొ నాల్డు, కర్నల్‌టాడ్, విల్సన్, సర్ విలియం జోన్సు, కోలుబ్రూకు, సర్ మోనియర్ విలియమ్సు, హీరన్ మున్నగు యైరోపీయ పండితులు మన సంస్కృత సారస్వత ప్రపంచమున విశేషముగ కృషిసల్పి ప్రాచీన భారతవర్షమును వేనోళ్ళ బొగడచు రచించిన గ్రంథములు పఠించినను, మన భారతావని పూర్వము సస్యవాటికలచే శోభాన్వితమై నేత్రపర్వమొనరించుచుండెడి దనియు, లక్ష్మి యిక్కడ తాండవమాడుచుండెడి దనియు, పూర్వులు గొప్ప మేధావంతు లనియు, సర్వశాస్త్రవిశారదులనియు, పరిపాలనా ధురంధరు లనియు, సత్యసంధులనియు, ఆధ్యాత్మిక విద్యాసంపన్నులనియు, నీతినియమములం దప్పని వారనియు, మనకు విశదము గాగలదు.

ఛాంబర్సు విజ్ఞాన సర్వస్వమను గ్రంథములో భారతవర్షము భూలోకముయొక్క సంక్షిప్తరూపమని యనేక యుగములనుండి భారతావని భాగ్యమునకు ప్రసిద్ధిబడసినదని వ్రాయబడినది. భూలోక ప్రధానలక్షణము లన్నియు భారతభూమిలో గలవని జెప్పు టతిశయోక్తి కానేరదు. మన సారవంతమైన భూములు, దట్టములైన యడవులు యున్నతములైన పర్వతములు, దీర్ఘములైన నదులు, నానావిధ మనోహర ప్రకృతి దృశ్యములు, శీతోష్ణపరిస్థితులు, పాశ్చాత్యప్రపంచమున కాశ్చర్యము గలిగించుచు, సృష్టికర్త సర్వోత్తమ ప్రకృతి ప్రసాదముల ననుగ్రహించి మన భారతవర్షమును ప్రత్యేకముగా సృష్టించినాడా యని పరిశోధకులకు తోచుచుండును. మానవకోటిలో



ననేక జాతు లుదయించి రూపుమాసినను భారతజాతి మాత్రము నేటివరకు నిలిచియున్నదిగదా! మహాభారత యుద్ధమునకు పూర్వమే భారతజాతి సర్వసభ్యతా లక్షణములు గలిగి సర్వాంశములందును సర్వమానవ ప్రపంచమున కచ్చెరువు గలిగించుచుండెడిది. భారత యుద్ధానంతరము గూడ పరదేశీయుల దండయాత్ర కాలమువరకు భారతభూమి ప్రపంచములో నితర దేశములకంటె మిన్నయై యొప్పుచుండెడిదని జెప్పవచ్చును.

## I

ప్రాచీన భారతీయులు సత్యసంధులై, యతివిశుద్ధమైన పరమ పవిత్రమైన చరిత్రగలవారని స్వదేభిమానముచే చెప్పియుంటినని తలంపరాదు. పరదేశీయులు కొందరు ప్రాచీన భారతీయులగూర్చి వెలిబుచ్చిన యభిప్రాయములవలన వారి యౌదార్యము, న్యాయబుద్ధి సత్యాన్వేషణము, గౌరవాశక్తి లోకప్రసిద్ధములని తెలియగలదు. 'స్ట్రైబో' హిందువులు సత్యసంధులు, వారు తలుపులకు తాళములు వేసికొనుటకు, నొడంబడికలకు పత్రములు వ్రాసుకొనుటకగత్యము లేకుండెడిద' ని వ్రాసియున్నాడు. రెండవ శతాబ్దపు యెపిక్టసు శిష్యుడు ఏరియన్ భారతదేశమందలి ఓవర్‌సీర్లనుగూర్చి వ్రాయుచు వారెప్పుడు తప్పురిపోర్టు చేయరనియు యెట్టిపరిస్థితులందు నాడితప్పని వారనియు పల్కియున్నాడు. సుప్రసిద్ధ చీనాయాత్రికుడు యువాన్ చ్వాంగు, ఆర్జవము, న్యాయబుద్ధి హిందువుల విశేషగుణములనియు నధర్మముగా ధనమార్జించువారు కారనియు, పరిపాలనయందు కపటము లేనివారనియు వర్ణించి యున్నాడు. "Though the Indians are of a light temperment, they are distinguished by the straightforwardness and honesty of their character. With regard to riches, they never take any thing unjustly; with regard to justice, they make even excessive concessions ... ... straightforwardness is the distinguishing feature of their administration."

అయిదవ శతాబ్దారంభమున టేసియసుయను యూనానీ వైద్యుడు టేసియా ఫ్రేగ్మెంటా యను గ్రంథములో తాను పెర్షియన్ కోర్టులో విన్నదాని నాధారముగా గైకొని భారతీయుల ధర్మాచరణనుగూర్చి వ్రాసియున్నాడు. పాటలీపుత్ర (పాలిబోత్ర)లో నున్న చంద్రగుప్తు (సాంద్రకోటసు) ని వద్దకు సెల్యూకసు నికటారుచే రాయబారిగా పంపబడిన మెగాస్తనీసు తన గ్రంథములో హైందవులు సత్య, ధర్మములను గౌరవించు వారనియు యీ కాలములో దొంగతన మరుదుగా నుండెడి దనియు వర్ణించుచు హిందూస్త్రీల పాతివ్రత్యము హిందూపురుషుల ధైర్యస్థైర్యముల గూర్చి కడునాశ్చర్య మొందియున్నాడు. ఏడవ శతాబ్దారంభములో చీనా చక్రవర్తియగు యాంగ్టీచే భారతదేశమునకు రాయబారిగా పంపబడిన ఫీ-టూ యను నాతడు భారతీయులగూర్చి వర్ణించుచు వారు సత్యప్రమాణములపై నమ్మకము గలవారని స్తుతించి యున్నాడు. పదునొకండవ శతాబ్దమునాటి 'ఇద్రిసి' యను మహమ్మదీయ గ్రంథకర్త తన భూగోళశాస్త్రమందిట్లు వ్రాసియున్నాడు. "The Indians are naturally inclined to justice and never depart from it in their actions. Their good faith, honesty and fidelity to their engagements are well known." భారతదేశీయులు న్యాయదృష్టి కలవారనియు, సత్యపథము నే ద్రొక్కు-వారనియు, వారి సహజ సరళస్వభావమే విదేశీయుల నాకర్షించెననియు అతని యభిప్రాయము. పదమూడవ శతాబ్దమునాటి మార్కో-పోలో బ్రాహ్మణులగూర్చి వ్రాయుచు వర్తకము వారిసహజవృత్తికాకపోయినను రాజుచే నియోగింపబడి వ్యాపారము సాగించెడివారనియు, జీవితములో నొకసారియైనను యనృతవాక్యము పలికి యెరుంగరని చెప్పియున్నాడు. పదునాల్గవ శతాబ్దపు ఫ్రయర్ జోర్డానసు కూడ యిట్టి యభిప్రాయము నే



వెలిబుచ్చినాడు అక్బరుచక్రవర్తియొక్క మంత్రిపుంగవుడగు అబుల్ ఫజల్ తన అయిన్ అక్బరీ యను గ్రంథములో యిట్లు వ్రాసినాడు: "The Hindus are religious, affable, cheerful, lovers of justice, given to refinement, able in business, admirers of truth, grateful and of unbounded fidelity.' హిందువులు మతనిష్ఠ గలవారు, ఆదరభావము జూపువారు, ఉత్సాహవంతులు, జ్ఞానాసక్తిగలవారు, న్యాయప్రియులు, వ్యవహారదక్షులు, సూనృతాభిమానులని యతని యభిప్రాయము.

బ్రిటిష్ పార్లమెంటుచే నియమింపబడిన విచారణసంఘమెదుట సాక్ష్యమిచ్చుచు వారన్ హేస్టింగ్సు భారతీయులగూర్చి ఈ క్రిందిమాటలు బల్కెను: "They are gentle and benevolent, more susceptible of gratitude for kindness shown to them, and less prompted to vengence for wrongs inflicted than any people on the face of the earth, faithful, affectionate, submissive to legal authority.' బిషపు హీబరు, ఎలిఫిన్‌స్టన్, సర్ జాన్ మాల్కం, సర్ తామసు మన్రో మున్నగువారు పాశ్చాత్యులైనను, హిందువుల గుణవిశేషములఁ దగురీతిని వర్ణించి, భారతీయులు ధైర్యవంతులనియు, గౌరవనీయులనియు, జ్ఞానసంపాదనాసక్తి గలవారనియు కష్టపడి పనిచేయువారనియు, యాడితప్పని వారనియు, తల్లిదండ్రులయెడ వినయము జూపువారనియు నభిప్రాయపడిరి. కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయ భవనమునందు పన్యాస మిచ్చుచు మాక్సుముల్లరు పండితు డిట్లు పల్కియున్నాడు: "I feel bound to say that, with hardly one exception, they have displayed a far greater respect for truth, and a far more manly and generous spirit than we are accustomed to, even in Europe and America. తాను రచించిన " India — what can it teach

us!" యను గ్రంథములో భరతఖండముతో సంపర్కము గల్గిన వారందరకు యీ దేశపు ప్రజల నడవడిలో ముఖ్యముగా కనిపించు లక్షణము సత్యానురక్తియే యని కూడ వ్రాసియున్నాడు.

ఇట్లు విదేశీయుల యభిప్రాయముల నొకటి వెంబడి యొకటి వ్రాయుట చదువరులకు విసుగుకల్గించు నన్నమాట సత్యమేయైనను మన ప్రాచీను లెట్టిలక్షణములు గల్గియుండిరో తెలియజేయుటకై యట్టిపని నిర్వహించితిని. గ్రంథవిస్తర భీతిచే వారి వారి యభిప్రాయములను పూర్తిగా వ్రాయుట విరమించుచున్నాను.

## II

ప్రాచీన భారతీయులు సాహసౌదార్యములం దగ్రస్థాన మలంకరించి యుండిరను టతిశయోక్తి కానేరదు. వారి ఆత్మవిశ్వాసము ధార్మికవర్తనము, ఆర్తత్రాణ పరాయణత్వము, స్వదేశాభిమానము, యనన్యసామాన్యములు. శ్రీరామ, అర్జున, కర్ణ, శ్రీకృష్ణ, భీమ, బలి, బలదేవ (హెర్కులీసు) సగర ప్రభృతు లాదర్శపురుషులుగదా! ఆధునికులలో మేవాడురాణా ప్రతాపసింహుడు, మార్వాడు దుర్గాదాసు, అజ్మీరు పృథ్వీరాజు, దేశాభిమాన సాహసౌదార్యములలో నద్వితీయులై ప్రకాశించిరి. రాజపుత్రుల యకుంఠిత శౌర్యపరాక్రమములు, దేశానురాగము, స్వగౌరవాసక్తి లోకప్రఖ్యాతములు. వారి జీవగానమునకు మాతృభూమియే పల్లవి. స్వదేశార్థము ఖడ్గపాణులై ప్రాణముల నర్పించుట వారి ముఖ్యధర్మము. ధర్మరక్షణకై రణరంగమున మరణించుటవలన వీరస్వర్గము ప్రాప్తించునని వారి గాఢవిశ్వాసము. గ్రీకు, రోమక రాజ్యచరిత్రములు, అయిరోపాఖండ రాజ్యచరిత్రములు చదివిచూచిన రాణా ప్రతాపసింహ, ఠాకూరు దుర్గాదాసు లను బోలు దేశాభిమాన



పూరితులు గానరారని పాశ్చాత్యపండితుల నిశ్చితాభిప్రాయము. రాజా మానసింగు, రాణా రాజసింగు, జస్వంతసింగు, రాణాప్రతాపుని కుమారుడగు నమ్రా మొదలగు రాజపుత్రవీరుల యుదంతములు నాగరకప్రపంచమున కాశ్చర్యము గలిగించునుగదా! ప్రాచీనగ్రంథములఁ బరిశోధించి, పాశ్చాత్యవిమర్శకులు వ్రాసిన గ్రంథముల కొన్నిటి (Col Tod's Rajastan, Annals and Antiquities of Rajastan, Edward Thomas Chronicles of the Pathan Kings of Delhi, J. Skinners' Military Memoirs మున్నగునవి.) పఠించిన మన ప్రాచీను లెంతెంతటి ఘనకార్యములు చేసియుండిరో విశదము గాగలదు. ఒక చిన్నరాష్ట్రమున కధిపతియగు ప్రతాపుడు ఢిల్లీశ్వరు నంతటివాని నెదిరింప సాహసించుటవలన యతని దేశాభిమానము, స్వేచ్ఛాపరతంత్రత, స్వజాతి గౌరవాపేక్ష వెల్లడియగుచున్నవి. అతని శౌర్యాగ్ని అజేయము. అతని యభినివేశన మనన్యసామాన్యము. అంత్యఘడియలలో తన కుమారుడగు నమ్రాను బిలచి భారతవర్ష స్వాతంత్ర్యమును భంగపరచు శత్రువులతో ననవరతము పోరుసల్పునట్లు శపథము చేయించెను.

దుర్గాదాసు అద్వితీయుడు, ధనకాంచనాపేక్ష కతీతుడు. ఫాదుషా వానికి లంచము, ఉద్యోగమిచ్చి వానిమార్గమున కవరోధము కల్గించుటకు నిత్యము ప్రయత్నము చేయుచునుండెడువాడు. కాని దుర్గాదాసు అమూల్యుడు, శత్రువుకు మేలుచేసియైనను గౌరవమునిల్పుకొను స్వభావముకలవాడు. ఫాదుషా కుమారుడయిన అక్బరును అతని తండ్రిచేతులలోబడి నాశనముగాకుండ విడిపించుటను బట్టి యితని యుదారస్వభావము వెల్లడియగుచున్నదిగదా! ఔరంగజేబు మనుమరాలు వీరిచే జిక్కినసమయమున వీరామెను ద్రూణారయందుంచి కాపాడిరన్న విషయము లోకవిదితము. ఇతని ఘన

కార్యములు చెప్పుకొనుచు రాజపుత్రులేగాక, భారతీయులందరు నిరంతరము స్తోత్రము చేయుచుందురు. ఇతని చరితము చిరస్మరణీయము శివాజీచరిత్ర చదివి జూచిన యతనిలో దేశాభిమానము, పౌరుషము సాహసౌదార్యములు, స్వగౌరవాసక్తి యాదర్శప్రాయములై ప్రకాశించుచున్నట్లు తెలియగలదు. భారతవీరులగూర్చి కర్నల్ టాడ్ తన 'రాజస్థాన్' గ్రంథమం దిట్లు వర్ణించినాడు.

"హోమరు వర్ణించిన వీరులు మహాభారతవీరుల ముందు మరుగుజ్జులవలె కన్పట్టుదురు. అతడు గొప్పగ వర్ణించిన అజాక్సు మహాభారతవీరుల ముంజేతి కంకణమునైన నెత్తగల్గుదురాయని నాకు సందేహము కలుగుచున్నది. హెర్క్యులీసు ఉత్తమ వీరుడు, ధైర్యశాలి, బలవంతుడు, యోధుడు. ఇతడు భారతీయుడుగాని గ్రీకు దేశస్థుడు కాదు. ఇతడే బలరాముడు. హెర్క్యులీసు శబ్దము హరికుల-ఈశ యను సంస్కృతశబ్దమునం దుద్భవించినది. ఇతడు భారతదేశములో జన్మించినట్లు డియోడోరసు చెప్పుచున్నాడు. హెర్క్యులీసునుగూర్చి అగయర్ వ్రాసిన కథ, పురాణములలో చెప్పబడిన కథయు నొక్కటే.

(సశేషము)

---

కాకినాడ మాస్టర్ మన్ ముద్రాశాల యందు ముద్రింపబడియె.